Registered No. M-4484

# యుద్ధ సంచిక

వాల్యుం II.] 1942 వ సం॥ నవంబరు నెల 20 వ తేది శుక్రవారం [నె 46 రు.



భారతీయ ప్రతినిధులకు చర్చిలు ప్రధాని స్వాగతము:—ఎడమనుండి ఎల్. ఎస్. ఆమెరీగారు ఇండియా మంత్రి, గౌ॥ సర్ రామస్వామి మొదలియారు, నవనగరు మహారాజా జాం సాహెబుగార్లు యుద్ధ మంత్రివర్గంలో ఇండియా ప్రతినిధులు; చర్చిలు ప్రధాని; క్రానుబర్న్ ప్రభువు వలస రాజ్యాల మంత్రి.

## ఫ్రెంచివారి ఉత్తరాఫ్రికా.

### అమెరికనుసేన లాక్రమించుట.

విషీ ప్రభుత్వం జర్మనీ పరమయినందున దాడిచేయవలసి వచ్చెను.

ఈ నెల 7 వ తేదిన అమెరికా సేనలు ఉత్తరాఫ్రికా తీరమునందు అనేకచోట్ల దిగి దాడి ప్రారంభించి ముందుకి పోయినవని గతవారం పత్రికలో చదివియున్నారు. ఉత్తరాఫ్రికాలో వారు దిగిన మొరోకో, ఆల్జియర్సు, లిబేరియా, ట్యూనిసియా రాష్ట్రాలన్ని ఫ్రెంచి ప్రభుత్వంచే పరిపాలింపబడుచుండెను. ఫ్రాంసులో ఉత్తర భాగం జర్మనీ ఆక్రమించినపుడు మిగిలియున్న ఫ్రాంసు భాగానికి ఫ్రెంచి సామ్రాజ్యానికి అధికారం వహించియున్న ప్రభుత్వాన్ని విషీ ప్రభుత్వం అంటారు. దీని కధ్యక్షుడు మార్షలు పటేను, లావెలు డార్లనులిద్దరు మంత్రులు. జర్మనీతో విషి ప్రభుత్వం సంధి షరతుల ప్రకారం ఫ్రెంచి సామ్రాజ్యంలో ప్రతి రాష్ట్రంలోను ఆర్మిస్టిసు సంఘాలు స్థాపింపబడినవి. సంధి షరతులు సరిగ అమలు జరుగుచున్నట్లు చూచుటకు పంపబడిన జర్మనీ ప్రతినిధులు యీ సంఘాలలో సభ్యులు.

అమెరికా సేనలు ఆఫ్రికా ఉత్తరాఫ్రికా దండయాత్రను సాగించుచున్నందున అమెరికాలో అమితోత్సాహంగానుంది. ఈజిప్టులో బ్రిటిషవారి విజయం తెలిసినవెంటనే యీపని జరుగుట

వలనను యెంతకాలంనుండో అమెరికానుండి వచ్చి యూరోపులో మకాం చేసిన అమెరికను సైన్యం యింతకాలానికి యుద్ధంలో దిగడమే కాక, సమిష్టి మిత్రమండలి సేనలు అమెరికను ఉద్యోగుల నాయకత్వమున నడుపబడుచున్నందునను అమెరికాలో మరీ ఎక్కువ ఆనందంగానుంది.

### దీనివల్ల కలిగే లాభాలు.

ఉత్తరాఫ్రికాలో యీ దాడివలన కలిగే లాభాలు రెండు. మొదటిది ఆఫ్రికా తీరాలనుండి శత్రు సేనలను తుడిచివేయడం, రెండోది మధ్యధరా సముద్ర మార్గాన బ్రిటిషు నౌకలు సూయజు కాల్వగుండా స్వేచ్ఛగ పోవడం. ఇందువలన రష్యా యుద్ధరంగంలో జర్మనుల ఒత్తిడి రష్యనులకు తగ్గిపోగలదు. మధ్యధరా సూయజు మార్గం నౌకలకు తెరువబడినచో మిత్ర రాజ్యాలకు సప్లయిలు ఆఫ్రికా ఖండమంతాచుట్టి అమిత ఆలశ్యంగా రా నవసరంలేదు. క్రొత్త వర్తక నౌక లెన్నో 'లభించినంత మేలు కలుగును. అరేబియా, పెర్షియా, రష్యా, ఇండియాలకు సరకు సప్లయి అతివడిగ జరుగగలదు.

మిత్రమండలికి నౌకాబలం జాస్తిగానుండబట్టే ఉత్తరాఫ్రికా దాడి కొనసాగెను. అమెరికను విమానదళములును, రాయలు విమానదళం వారును ఆల్జియర్సు, మొరోకో విమానాశ్రయములవరకు నౌకలపైనే వచ్చిరి. అనుకున్న ప్రకారం ఘడియ తప్పకుండ 1,600 మైళ్ల విశాలమగు ప్రాంతమున అచ్చటచ్చట ఒకేమారు క్రొత్త రాజ్యంలో దిగి దాడి సలుపుటకు, అమెరికను సేనానాయకుడగు జనరలు ఎసనుహోనరు గారికి, బ్రిటిషు నౌకాదళ సేనానియగు అడ్మిరలు కన్నింగుహాంగారు ఎంతయు తోడ్పడిరి. ఈ దాడియొక్క ప్రయోజనంగూర్చి అమెరికా అధ్యక్షుడు రూజువెల్టు తన సందేశంలో స్పష్టంగా తెలిపియుండెను. ఫ్రాంసును బానిసత్వంనుండి విముక్తిచేయుట, ఉత్తరాఫ్రికానుండి జర్మను ఇటలీ సేనలను తరిమివేయుట అని వారు సెలవిచ్చిరి. శత్రువులు ఫ్రాంసు సామ్రాజ్యంనుండి పూర్తిగ తొలగింపబడిన పిమ్మట ఆ సామ్రాజ్య దేశాలు ఫ్రాంసు స్వతంత్ర ప్రభుత్వమునకు ఒప్పగించబడును. విషీ ప్రభుత్వంలో ఒకరిద్దరు పెద్దలు జర్మనీకి సుముఖులుగనుండి, విషీ ప్రభుత్వానికే ముప్పు రానున్నందునను, అందువలన మధ్యధరాసముద్రంలో మిత్ర రాజ్యాలకు నష్టం కలుగనున్నందునను యీదాడి చేయవలసివచ్చెను.

### విషీ-జర్మనీ సంబంధం

విషీ ప్రభుత్వానికి అక్షరాజ్యాలు (అంటే జర్మనీ-ఇటలీలకు)గల సంబంధంగూర్చి కొంచెం తెలుసుకుందాం. 1940 లో ఫ్రాంసు ఓడిపోయి జర్మనీతో సంధి చేసుకున్నపుడు, ఫ్రెంచి సామ్రాజ్య దేశాలలోనికైన శత్రువులు రాకుండ విషీ అధికారులు నిరోధించగలరని ఎంచబడెను. కాని ఆ ఆశలు అడియాసలని శత్రురాజ్యాల చర్యబట్టి రుజువయింది. ఉత్తరాఫ్రికాలో ఆర్మిస్టిసు సంఘాలు యేర్పడి, అనేకమంది జర్మనులను దింపి దేశములలో ప్రచారంచేసి, వారి ధైర్యం చెడగొట్టిరి. విషీ ప్రభుత్వ మంత్రులగు లావెలు, డార్లనుగార్లు జర్మనీ నాజీలతో కుట్రలుపన్ని తమ మాతృదేశమగు ఫ్రాంసుకి ద్రోహంచేసిరి. నాజీలు ముందు రహస్యంగా చేరి, తరువాత విషీ ప్రభుత్వాన్ని వశంచేసుకొనిరి.

ముందుగ ఆర్థిక విషయాలందు నాజీలు అధికారం వహించిరి. ఫ్రాంసు వలసరాజ్యములందలి పంటలన్ని ఎక్కువ ధరలిచ్చి జర్మనులుకొని జర్మనీకి, జర్మనీ ఆక్రమించిన దేశాలకు పంపేవారు వారిచ్చే డబ్బు ఎందుకు పనికిరాని కాగితపు నోట్లు. ఫ్రెంచి నోట్లు కావలసినన్ని వారే తయారుచేయించిరి. ఈ చర్యలకు అయిష్టత తెలుపుతు జనరలు జాకెట్టిగారు, టునీషియాలో సప్లై కంట్రోలు అధికారి, తన పదవికి రాజీనామానిచ్చెను. ఫ్రెంచి, ఆఫ్రికాలోని పరిశ్రమలన్ని నాజీ కంపెనీ స్వాధీనంలోనికి మారేయి—మోటారు పరిశ్రమ, పెట్రోలు, ఫోస్ఫేట్సు ఉత్పత్తిమున్నగునవన్ని. లావెలు అనుచరులు యీ వ్యాపారం నాజీ జర్మనులకు అనుకూలంగా నడుపుచుండిరి. అన్నింటికన్న ముఖ్యమయినది సైనికాధికారం. మోసంచేసి నాజీలు యీ అధికారం సంపాదించిరి. ఉత్తరాఫ్రికాలోని సైనికాధికారం చే జిక్కించుకుందికే బిజర్టా, ఆల్జియర్సు, ఒరాను, కెనిట్రా, కసబ్లాంకా రేవు నగరాలందు అక్షరాజ్యాల ఆర్మిస్టిసు కమిషన్లు స్థాపించబడినవి. ఫ్రెంచి మొరోకోలో జర్మను సేనలున్నట్లు మొదటిసారి 1941 మార్చిలోనే కామన్సు సభలో తెలుపబడెను. జర్మను నిపుణులు ఉత్తరాఫ్రికాలో ప్రవేశించి, నౌకాదళకేంద్రాలు, విమానా

[తరువాయి 7 వ పేజిలో]

# జపాను దుర్నయాలు.

## అండమాన్సులోను డచ్చి దీవులందు లూటీలు, కాల్పులు.

అండమాను దీవులను గత మార్చి 23 వ తేదిన జపానీయులు ఆక్రమించినప్పటినుండియు, స్థానిక ప్రజలపై అత్యాచారాలు చేస్తున్నారని పోర్టుబ్లేరునుండి వచ్చిన మొదటి వార్త తెలుపుచున్నది. లూటీ చేయడం, యిండ్లు పడగొట్టడం, ప్రమాదకరమగు నేరస్తులను విడుదల చేయుట, ఉదయంనుండి సాయంకాలవరకు బానిసలవలె పనిచేయించుట జరుగుచున్నది. ఇవన్ని చూచిన ఒకడు వ్రాసిపంపిన రిపోర్టు ఇండియాలో సైనికాధికారులకు చిక్కింది. అందిట్లు గలదు ; జపానువారు ఆక్రమించిన వెంటనే జెయిళ్లలోనున్న అతిప్రమాదకరమైన ఖైదీలను విడుదలచేసిరి. తరువాత ఖైదీలును, స్థానిక నివాసులు ఉచితంగా వలసవచ్చినవారును కలసి తిరుగుదురు. విమానాశ్రయములందు నౌకాదళం రేవులందునుమాత్రం అందరు కలిసి తిరుగరాదు.

### స్త్రీలపై ఘోరాలు.

జపానీయులు ఆక్రమించిన ఒకవారంలో వ్యాపార సంస్థలను యిండ్లను లూటీచేసి, స్త్రీలను చెరచి బిడ్డలను హింసింప సాగిరి. ఈ అత్యాచారాలన్ని యిపుడు లోకవిదితమయినవి.

ఒక గ్రామంలో జపాను సోల్జరులు ఒక యిల్లు తగులబెట్టిరి. మంటలు ఎవ్వరు ఆర్పలేదు, 50 లేక 60 యిండ్లు కాలిపోయినవి ; వందలకొలది ప్రజలు యిండ్లు లేక అవస్థపడిరి. ఇట్లాంటివి జరుగుతూవుంటే జపాను అధికారులు బలవంతంగా స్థానిక ప్రజలను యీడ్చుకవచ్చి, ఉదయంనుండి సాయంకాలంవరకు కూలిపని చేయించి 0-8-0 డబ్బు లిచ్చిపంపుచున్నారు.

### డచ్చి తూర్పు దీవులలో.

రాడెను లోక్‌మను జజడినుగ్రాటుగారు, అదివరకు డచ్చి తూర్పు దీవులందు విద్యాశాఖ డైరక్టరుగనుండి, యిపుడు వాషింగుటనులో నెదరులండ్సు ఆర్థిక సంఘం సభ్యుడుగ నున్నారు. వారు తమ దీవులను జపాను వారాక్రమించిన పిమ్మట స్థితినిగూర్చి యిట్లు తెలిపిరి :—

జపానువారు ఒక చేత్తో మా ప్రజలను ఆదరించుచు యింకో చేత్తో కొరడా పుచ్చుకొని వారిని కొట్టుచున్నారు. తూర్పు దీవులలో పెక్కండ్రు మహమ్మదీయులు. వారికి జపాను "నూతన విధానం" సరిపడదని జపానువారికి తెలుసు. అందుకే ఇస్లాము మతాచారములను అనుసరించి కొనసాగించుటకు వృధా ప్రయత్నం చేయుచున్నారు. క్రైస్తవ పండుగ సెలవులు తీసేసి జపాను పండుగ సెలవులు యేర్పాటుచేసినప్పటికి ముస్లిము సెలవులను మాత్రం మార్చలేదు. అదివరకు ముస్లిము సంవత్సరాది సెలవుదినం కాకపోయినను జపానువారు సెలవుదినముగా నిర్ణయించిరి.

కాని జపానువారి ప్రచారం నిజమగు మహమ్మదీయులను మోసగించదు. ఇతర మతాలంటే జపానువారి కెటువంటి అసూయో ఇస్లాము మతం అంటే కూడ అంతేయని తూర్పుదీవుల మహమ్మదీయు లెరుంగుదురు.

తాము పరిపాలించువారందరివద్ద కట్టుబడులను జపానువారు అతిదారుణంగా వసూలుచేయుదురు. దీవులలో వీధులవెంబడి తిరిగి వస్తువుల విక్రయించువారి సంఖ్యయే యెక్కువ. వారి వస్తువులను జపానువారు తీసుకొనిపోయి వారిని దివాలాచేసిరి. స్థానిక ప్రజలు తిండిలేక మాడుచున్నవారు చిన్నచిన్న దొంగతనములు చేసినను కఠినతరమగు శిక్షలు వేస్తున్నారు. దొంగతనం చేసిన దొంగ చేయికోస్తారు. ఇతర చిన్న నేరాలకు ఉరిశిక్షలే విధించుతారు.

## నల్గురు యోధులు.

అమెరికా అధ్యక్షుడు రూజువెల్టుగారి నల్గురు కొడుకులును విదేశాలందు యుద్ధంలో పనిచేస్తున్నారు. మెరైనుకోరు మేజరు జేమ్సు రూజువెల్టుగారు సాలమెన్సు దీవులలో నున్నారు. చిన్న కొడుకులు యిద్దరు లెఫ్టనెంటులుగ డిస్ట్రాయరు నౌకలపై నున్నారు. జానుగారు పశిఫికు సముద్రంలో నాల్గు డిస్ట్రాయరులకు సప్లయి ఆఫీసరుగను, ఫ్రాంకిలిను జూనియరుగారు అట్లాంటికులో ఒక డిస్ట్రాయరుపై గన్నరీ ఆఫీసరుగనున్నారు. లెఫ్టనెంటు కర్నలు ఎలియటు రూజువెల్టుగారు, ఇంగ్లాండులో ఆర్మీ ఏవియేషను కమాండులో నున్నారు.

# భారతీయ గ్రామస్తులు - బ్రిటిషు సోల్జరులు.

●

భారతీయ గ్రామస్తులు తమంతతాము బ్రిటిషు సిపాయిలకు సహాయం చేయుచున్న కధలు అనేకం వినవచ్చుచున్నవి. ఒకవేళ ఇండియాపై జపానువారు దండెత్తివస్తే బ్రిటిషు సోల్జరులకు ప్రజల సహాయం దొరకదను భయం ఉండనవసరంలేదని యీ చర్య రుజువు చేయుచున్నది.

ఎలా జరుగుతుందో చూదామని బ్రిటిషు సోల్జరులు కొందరు చాల కొంచెం తినుబండారములు పట్టుకొని 50 మైళ్లదూరం ప్రయాణం ప్రారంభించిరి. వారనుకొన్న కష్టాలేమి లేకుండా అతి సౌఖ్యప్రదంగా వారు ప్రయాణం ముగించిరి.

త్రోవలో పగలు వారికి గ్రామస్తులు పండ్లు యిచ్చేరు. రాత్రులందు వారికి గ్రామీయులు చేకూర్చిన సౌకర్యములవలన, భారతీయుల ఆదరణ యెంత యెక్కువగనుండునో బ్రిటిషు సోల్జరులకు విదితమయ్యెను.

ఒక గ్రామంలో ఒక స్కూలుమాష్టరు వారందరికి తన పాఠశాలయందు బసలిచ్చి పక్కలమర్చెను. అంతకంతకు గ్రామస్తు లధికంగావచ్చి సోల్జరులకు కానుక లిస్తూవుండగా దుబాషిగానుండి వారిమాటలు వీరికి వీరిమాటలు వారికి బోధపరచి ఆ స్కూలుమాష్టరు తెలుపుచుండెను. చివరకు గ్రామస్తులును సోల్జరులును మిత్రులై ఒండొరుల అభిప్రాయములు బాగా తెలుసుకొనగల్గిరి.

ఇంకొకజట్టు సోల్జరులకు యిటువంటి అనుభవమే కలిగెను. వారికి గ్రామంలోని మంగలి దుకాణంవాడు ఆతిధ్యమొసంగెను. అతడు తన యిల్లు వారి కొసంగెను. రాత్రి పక్కలేర్పరచి, సాయంకాలం ఫలహారము లొసంగి మరునాడుదయం టీ చేసియిచ్చి, కోడిగ్రుడ్లు, రొట్టె, వెన్న, తేనె, పండ్ల మురబ్బాలు పండ్లు కడుపునిండ పెట్టెను.

సోల్జర్లు అమితానందభరితులైరి, కాని ఆతిధ్యమొసంగిన మంగలి మాత్రం తృప్తిచెందలేదు. చివరకు సోల్జరు లందరు డబ్బు పుచ్చుకోకుండా క్షవరం చేయించుకుంటేకాని ఒప్పలేదు.

# సిపాయికొరకు గ్రామస్తుడు ప్రాణంతెగించుట.

●

ఒక భారతీయ సిపాయి ఒక గ్రామం చేరువ మకాంచేసియున్న గుడారంలోనుండి బయటకు పోయి ఒక నేలబావిలో ప్రమాదవశమున పడిపోయెను.

అది చూచిన ఒక గ్రామస్తుడు వెంటనే నూతులోదిగి సిపాయిని తీసెను. కాని సిపాయికి ప్రధమ చికిత్స చేసినా బ్రతుకలేదు.

ధైర్యస్తుడగు ఆ గ్రామస్తుని గుడారంలోనికి పిలిచి సేనాధికారి బహుమతి చేసెను.

చనిపోయిన సిపాయియొక్క సైనికదళము 200 మైళ్ల దూరంలోనున్న క్రొత్త మకామునకు పోవుచుండెను.

---

# సిపాయీలకు సినీమాలు.

●

వేలకొలది బ్రిటిషు సోల్జరులు భారతీయ సిపాయిలును యికముందు సినీమాలకు పోరు. సినీమా పటములే వారివద్దకు పోవును.

మదరాసునుండి ఆఫ్రికావరకు సినీమాలు సంచారం చేయుచు భారతీయ సైనికదళములు ఎక్కడనుంటే అక్కడకు పోతూవుంటాయి. ఇదివరకున్న యిటువంటి సంచార సినీమాలకు యింకో సినీమా చేర్చబడినది. హైదరాబాదు యుద్ధనిధి కార్యవర్గంవారు రూ 33,000 లు ఖర్చుచేసి దీనిని తయారుచేసి యిచ్చిరి.

ఇందులో సరిక్రొత్తరకం టాకీ యంత్ర సామగ్రి అంతా కలదు. దీనిని 18 వ హైదరాబాదు ఐ.ఎ.ఓ.సి. మొబైలు సినీమా అంటారు. ఇంగ్లీషు, భారతీయ దేశభాషల ఫిల్ములు చాల దీనిలోనున్నవి.

సిపాయీలకు ఎటువంటి ఫిల్ములు నచ్చుతవి అని ఒక ఉద్యోగిని అడుగగ, మికీమౌజు వాల్టు డిస్నీగారి వ్యంగ చిత్రాలు బాగా నచ్చుతాయని చెప్పెను.

హెచ్. పి. హాలిఫాక్సు విమానం.



హాండ్లీ పేజ హాలిఫాక్సు అనబడు బ్రిటిషు బాంబరు విమానం. దీనికి నాలుగు ఇంజనులుండును. రెక్కల పొడవు 99 అ॥ విమానం పొడుపు 70 అ॥ ఎత్తు 22 అ॥ తోక కొనను ఫిరంగుల గది గలదు.

# చీనాలో ప్రత్యేక ప్రాంతీయ హక్కులు.

అవి పుట్టి పెరిగి పోయిన కథ.

1911 వ సం॥ అక్టోబరు 10 వ తేదిన చీనా ప్రజా ప్రభుత్వం స్థాపించబడెను. 1942 వ సం॥ అక్టోబరు 10 వ తేదిన సరిగా 31 సంవత్సరాలు గడచినపిదప ఇంగ్లాండు అమెరికాలు చీనాలోనున్న తమ దేశీయులకుండిన ప్రత్యేక ప్రాంతీయ హక్కులను విడనాడి ఆధునికి చీనా స్వాతంత్ర సమర వార్షికోత్సవం జరిపినవి.

ఈ ప్రతేక ప్రాంతీయ హక్కుల చరిత్ర చాల పెద్దది. ఇవి ఎప్పుడూ చీనా పాలకులకు చిక్కులు కలిగిస్తూనే యుండేవి. 19 వ శతాబ్దంలో యూరోపు చీనాల మధ్యయుండిన అపోహల ఫలితంగా యీ హక్కులు పుట్టినవి. మొదట్లో చీనాతో వ్యాపారం చేసేహక్కు ఈస్టు ఇండియా కంపెనీకి మాత్రం ఉండేది. చీనాలో ఒకే ఒక వర్తక సంఘంతో కాంటను నాగరంలోమాత్రం వర్తకంచేయ యీ కంపెనీకి హక్కొసంగబడెను. చీనా ప్రభుత్వం బ్రిటిషువారిని సరి సమానులుగచూడ నొల్లకున్నందున చీనా ప్రభుత్వమునకు బ్రిటిషు ప్రభుత్వమునకు సఖ్యత లేకుండెను గాని చీనావారికి బ్రిటిషు కంపెనీకి మాత్రం సఖ్యతగానే యుండెను.

1834 వ సం॥లో ఈస్టు ఇండియా కంపెనీ వారి వ్యాపార గుత్త హక్కును బ్రిటిషు ప్రభుత్వం తీసివేసెను. దీని ఫలితంగా యుద్ధం జరిగెను. ఔదార్యవంతమగు యీ మార్పు చీనా ప్రభుత్వానికి నచ్చలేదు. పేరుకి నల్లమందు కొరకు జరిగిన యుద్ధాలే అయినా అన్యజాతుల గూర్చి న్యాయ సిద్ధాంతములగూర్చి యూరోపు చీనాలలో ప్రబలియుండిన విరుద్ధభావాలే యుద్ధాలకు కారణమైనవి. చీనా సామ్రాజ్య ప్రభుత్వం యొక్క సాంప్రదాయాలు నీతి నియమాలు అనేక శతాబ్దముల నాటివగుటచే నూతన యూరోపియను విధానం చీనాకు నచ్చలేదు. అందుచే యిటువంటి ప్రాగ్పశ్చిమ విభిన్న సాంప్రదాయాలకు ఘటీరాక తప్పదు. 1839 వ సం॥లో ఇండియా నల్లమందంతా చీనా తీసుకోడంతో యుద్ధం ప్రారంభమైంది. ఈ నల్లమందు యుద్ధాలు బ్రిటిషువారు చీనాతో తమ హక్కులకొరకుగాక ఇండియా హక్కులు కాపాడుటకై పోరాడుట చిత్రమయిన విషయం. నాటి యుద్ధంవలన భారతీయ వర్తకులు లాభంపొందరని తెలుపుటకు అహమ్మదాబాదులో హాతి సింగు సేటుగారు కట్టించిన జెయిన దేవాలయమే నిదర్శనం.

యుద్ధం 1842 వ సంవత్సరము వరకు కొనసాగింది. చివరకు చీనా ప్రభుత్వం సరిసమానమగు రాజ్యంతో పోరాడుచున్నామని గుర్తించి

నాన్కింగు ఒడంబడిక గావించుకొనెను. ఈ సంధివలన బ్రిటీషువారికి ఒక్కకాంటను గాక, ఆమి, పూచో, నింగుపో, షాంగై రేవులన్నీ ప్రవేశించుటేగాక కొన్ని వర్తక సౌకర్యముల హక్కులనుగూడ పొందిరి ఇంక యూరోపు జాతులుగూడ యీ యుద్ధ ఫలితం పొందినవి. ఫ్రాంసు-అమెరికాలుగూడ రాయబారాలు జరిపి యిటువంటి హక్కులే పొందినవి అమెరికా సంధిలో ప్రత్యేక ప్రాంతీయ హక్కులు వివరంగా పేర్కొనబడెను.

### ప్రత్యేక హక్కు లెటువంటివి.

రాజకీయ పరి బాషలో ప్రత్యేక ప్రాంతీయ హక్కులనగా విదేశ ప్రభుత్వ ప్రతినిధులకుండే న్యాయ విచారణ సౌకర్యములు. వారు స్థానిక సివిలు కోర్టులు, క్రిమినలు కోర్టులకు పోలీసులకు లోబడి యుండరని, వారి కార్యాలయా లున్నంత ప్రాంతంలో స్థానిక ఉద్యోగుల అధికారం చెల్లదని, చీనాలో యీ సౌకర్యాలు సంధి పత్రాలలో పేర్కొనబడిన రేవు లందు నివశించు విదేశీయు లందరికి వర్తింప జేయబడినవి. వారు తమ తమ ప్రభుత్వ ప్రతినిధులు స్థాపించుకొన్న కోర్టులు వాటి న్యాయశాస్త్రములవల్లనే నేరం చేస్తే విచారింపబడవలెను. అనుసరణయందు యీ పద్ధతి చీనా వారికి, యూరోపియనులకుగూడ మేలుగనేయుండెను. యూరోపియను న్యాయస్థానాల న్యాయమే దేశీయులకుగూడ చీనా వర్తకులకు ప్రజలకు నచ్చినది.

చీనా ఉద్యోగులతో సానుకూలం లేక 1856 లో మరల యుద్ధాలు జరిగి 1858 వ సంవత్సరములలో క్రొత్త సంధిపత్రాలు యింకా ఖచితంగా నేర్పడ్డాయి. అటుతరువాత తగవులు వర్తక వ్యాపారలవల్ల రేవులవద్దగాక, లోభాగంలో క్రైస్తవ మిషనరీల చర్యలవల్ల పెంపొందినవి.

కాని యీలోగా చీనాలోనే భావవిప్లవం పెరుగుచుండెను. అమెరికాలో అబ్రహాంలింకోలను, ఇంగ్లాండులో గ్లాడుస్టను ప్రధానివంటి లోకోత్తర పురుషులు క్రొత్త రాజకీయాదర్శాలను స్థాపించుచుండగా ఆ పడమటి గాలి ఇండియా చీనాలకు తాకకుండా యుండునా? ఇండియాలో జాతీయ మహాసభ (కాంగ్రెసు) ఆకాలంలోనే స్థాపించబడెను. చీనాలో చాంగు చిటింగు అను గొప్ప వైస్రాయి ఉద్భవించెను. 1894-95 యుద్ధంలో చీనాను జపాను ఓడించెను. కొంత కాలం చీనాలో నానా అరాచకంగానుండెను. దేశీయుల హక్కులను గాని విదేశీయుల హక్కులను గాని కాపాడ సమర్థతగల కేంద్ర ప్రభుత్వం లేనందున యూరోపు ప్రభుత్వాలు అమెరికాయు తమకుగల ప్రత్యేక హక్కులను వదలుకొనయిష్టపడకుండెను. గత యుద్ధానంతరం వెర్సలిసు సంధితో జర్మను హక్కులు వదలుకొనబడెను. రష్యా ప్రత్యేక హక్కులు రష్యా ప్రభుత్వం తనంత తానే వదలుకొనెను. కాని చీనా దేశీయ వ్యవహారములందు సోవియటు ప్రభుత్వం చేయి చేసుకొనుచుండుటవలన రష్యా ప్రజల హక్కు లిదివరకు కన్న బాగానే సంరక్షింపబడెను.

1922 లో బ్రిటను, అమెరికా, జపాను మున్నగు తొమ్మిది ప్రభుత్వాలు వాషింగుటనులో సభ చేసి చీనాలో ప్రత్యేక ప్రాంతీయ హక్కులను వదలుకొనుటకు అంగీకరించినవి. 1926 లో ఒక ఉపసంఘం నియమింపబడి, ప్రత్యామ్నాయంగా నుండవలసిన యేర్పాటును నిర్ణయింప కోరబడెను. "విదేశీయుల ఆస్తి ప్రాణాలు కాపాడగల" దిట్టమయిన చీనా ప్రభుత్వం స్థాపించుటే యీ రాజ్యాల ముఖ్య వాంఛయని ప్రకటించబడెను.

ఇంతలో చీనాలో యుద్ధనాయకులనేకులు బయలుదేరి ఒండొరులపై యుద్ధాలు చేసుకొనుచుండిరి. పైగా 1934 లో జపానుతో యుద్ధం సాగుచుండెను. అందుచే ప్రభుత్వ సంస్కారానికి నిరోధం కలిగెను. చీనా అంతటిలో తన మాట చెల్లే ప్రభుత్వం స్థాపింప వీలులేకపోయెను. కాని చీనా ప్రజలందరి హృదయాలను పాలించుచున్న నాయకుడు మార్షలు చియంగ్ కాయి షేకు బయలుదేరెను. అతడు బ్రిటను-అమెరికాల సహాయంతో చీనా అంతటిపై తన పరిపాలనాధికారం బాగా స్థాపింపజేయుచున్నాడు, అంతేకాక జపానీయులను తన దేశంనుండి తరిమివేయ యత్నించుచున్నాడు. అతనియందు విశ్వాసం, స్నేహభావంతోనే బ్రిటను-అమెరికాలు యిప్పుడు తమ హక్కులను వదలుకొన్నవి. అతని పరిపాలన న్యాయంగానుంటుందని, స్థిరంగానుంటుందని, విప్లవ యుద్ధఫలితంగా తయారయిన క్రొత్త చీనాలో దేశీయులకు విదేశీయులందరికి న్యాయం సరిసమానంగా నుంటుందని ప్రత్యేక హక్కులుండనవసరం లేదనియు వారు గుర్తించిరి.



✻

రష్యాలో
ఒకచోట యుద్ధంచేసి
అలసి పడిపోయిన
జర్మను సిపాయిలు.

✻

## మెర్సమట్రుయందు భారతీయ సైనికులు.

ఈజిప్టులోని మెర్సమట్రు రేవుస్థలమునుండి శత్రువులను తరిమివేసిన వెంటనే మొదట ప్రవేశించిన భారతీయ సైనికదళంతోనుండిన ఒక విలేఖరి యిట్లు తెలిపెను :—

శత్రువులు పారిపోయినపుడు విడిచిపోయిన చలిబట్టల లారీ ఒకటి భారతీయ సైన్యానికి లభించెను. సైనికులు తమకు కావలసినన్ని తీసుకొని మిగిలినవి దారిన పోయిన వారందరికి గిరవాటు వేస్తూ పంచిరి.

అచ్చటచ్చట దాగియున్న శత్రువులింకను గుండ్లు ప్రేలుస్తున్నారు. కాని పెద్దరోడ్డు మలుపుతిరుగగానే వారికి స్వాగతమిచ్చినవారు 14 గురు గూర్కా సైనికులు యిద్దరు పంజాబీలు, యిద్దరు చికిత్సచేయువారు.

టొబ్రుకులో పట్టుపడి మెర్సమట్రు రేవులలో పనిచేయుటకు యిరువురు దక్షిణాఫ్రికనులు శత్రువులవద్ద ఖైదీలుగానుండిన వారగుపడిరి. వారిపుడు ఒక జర్మను ఉద్యోగిని నల్గురు సైనికులను ఖైదీలుగ పట్టుకొనియున్నారు.

(2 వ పేజీ తరువాయి)

శ్రయాలు నిర్మించిరి, విషీ-జర్మనీ సంధి జరిగిన నాడు మూడు నాలుగు వందల విమానాలుండెను. అవన్ని జర్మనులు తీసుకున్నారు.

జర్మనీకి అనుకూలంగా నుండేవారినే పెద్ద మిలిటరీ సివిలు ఉద్యోగాలలో డార్లాను నియమించెను. కాని లావెలు ఫ్రాంసులో పూర్తిగ హిట్లరు బంటుగ మారిపోయినాక డార్లను జర్మనీకి ప్రతికూలంగా మారెను. అమెరికను సేనలు ఉత్తరాఫ్రికాలో దిగినపుడు వారికి సహాయంచేసి హిట్లరు లావెలుగార్లపై పగసాధించెను. మార్షలు పెటెను అతన్ని దస్మిను చేసెను. స్వతంత్ర ఫ్రెంచి నాయకులగు దిగాలుకూడ డార్లన్ను నిరశించెను. అధ్యక్షుడు రూజువెల్టుగూడ డార్లనుతో తన సేనానాయకుడు ఆఫ్రికాలో చేసిన తాత్కాలిక ఏర్పాటులన్నియు అంగీకరించుచు, యుద్ధావసరాన్నిబట్టి యీ యేర్పాటు చేసుకున్నామనిరి.

ఈ తాత్కాలిక ఏర్పాటువలన ఫ్రెంచి ఉత్తరాఫ్రికా అక్షరాజ్యాల బారినుండి తప్పింది. ఫ్రాంసుకి మిత్ర రాజ్యాలకు వాటి ముప్పు తొలగింది.

# మధ్యే - మధ్యే - జపానీయం.

ఈ మహాసంగ్రామం ప్రపంచమంతటను విస్తరించి సాగుచున్నది. ఏ రోజున ఏ దేశంలో, ఏ సముద్రంలో ఏ మూల యుద్ధం విజృంభిస్తూ ఉంటుందో చెప్పుటకు వీలులేకుండా ఉన్నది. భగవంతుడు సర్వాంతర్యామి అన్నట్లుగా, సంగ్రామదేవతకూడా సర్వాంతర్యామిగా వెలసియున్నది. ఒక రోజున రష్యాకు ఉత్తరంగా ఏ ఉత్తరధృవ ప్రాంతంలోనో రష్యాకు పోయెడి బ్రిటిష్ నావల మురాకున్నూ జర్మను విమానాలకున్నూ పెద్ద యుద్ధం జరుగుతుంది. ఇంకొక రోజున, మధ్యధరాసముద్రంలో మాల్టాకు పోయెడి బ్రిటిష్ నావల మురాకున్నూ జర్మను విమానాలకున్నూ యుద్ధం జరుగుతుంది. లేదా ఇటాలియను నౌకాదళానికిన్ని బ్రిటిష్ యుద్ధ నావలకున్నూ యుద్ధం జరుగుతుంది. లేదా, ఈజిప్టుకు యుద్ధ సామగ్రులను, శత్రుసేనలను పెట్రోలును చేర్చేటటువంటి శత్రు నావల మురాలకున్నూ మిత్ర విమానాలకున్నూ యుద్ధం జరుగుతూ ఉంటుంది. మరొక రోజున ఆస్ట్రేలియాకు తూర్పుగా ప్రక్కనున్న సాలమను దీవులవద్ద అమెరికను నావలకున్నూ జపాను నావలకున్నూ యుద్ధం జరుగుతూ ఉంటుంది. లేదా, ఉత్తరధృవప్రాంతంలో అలూషియను దీవులవద్ద జపాను నావలకు అమెరికను విమానాలకు యుద్ధం జరుగుతూ ఉంటుంది. లేదా పసిఫిక్కు మహాసముద్ర మధ్యంలోనే ఏ మిడ్వే దీవులవద్దనో (ఏ మధ్యేమార్గదీవులవద్దనో) అమెరికా ఖండానికి ఆసియా ఖండానికి మధ్యనున్న నట్టనడిసముద్రంలో నౌకాయుద్ధం అమెరికను నావలకు జపాను నావలకు జరుగుతూ ఉంటుంది. ఈ విధంగా ఉత్తర ధృవం మొదలుకొని దక్షిణ ధృవంవరకు ఒక్కటే మహా సంగ్రామ రంగంగా ఏర్పడి ఉన్నది.

గడచిన అయిరోపా సంగ్రామంలోకూడా యింత విస్తారంగా యుద్ధరంగం విస్తరించలేదు. వెనుకటి మహాసంగ్రామమునకున్నూ, ప్రస్తుత మహాసంగ్రామమునకున్నూ ఒక్క విషయంలో పెద్ద వ్యత్యాసం ఉన్నది. వెనుకటి మహాసంగ్రామంలో జపానుదేశం యుద్ధరంగంలోకి దిగలేదు. తటస్థంగా ఉంది. మీదు మిక్కిలి బ్రిటిష్ వారికి, అమెరికావారికి వీలైనంతవరకు సుముఖంగానే ఉంది. అప్పటి సంగ్రామకాలంలో జపాను దేశం తటస్థంగా ఉండుటవల్ల జపానుదేశం చాలా లాభం పొందింది. జర్మనీ సరకులు ఇతర యూరోపియను రాజ్యాల సరకులు రవాణాలు కాకుండా ఆగిపోయిన ఆ దినాలలో జపానుదేశం తన సరకులనే ఎక్కువగా రవాణాచేసి వ్యాపార లాభం చాలా అపారంగా పొందినది. ఈ వ్యాపారావకాశంవల్ల సంపాదించిన ద్రవ్యంతో తన ఫ్యాక్టరీలను పెంచి వృద్ధిచేసుకొన్నది. కాని, యీ పర్యాయం ప్రారంభమైన మహాసంగ్రామంలోనికి తానుకూడా దిగి తానుకూడా రాజ్యాలు సంపాదించవలెనని జపాను సంకల్పించుకొన్నది. అపార పారావారమైన సముద్ర వ్యాపారం సంపాదిస్తే చాలదనే దురాశచేత, సముద్రాలనే జయించాలని నిశ్చయించుకొన్నది. ఈ కారణంచేత, బ్రిటిష్‌వారిమీదను అమెరికావారిమీదను జపాను దేశం యుద్ధం ప్రకటించి కయ్యమునకు కాలు దువ్వింది. అందువల్ల శాంతమహాసముద్రంలో కూడా (పసిఫిక్కు మహాసముద్రంలోకూడా) యీ పర్యాయం యుద్ధం చెలరేగింది,

అయితే, యీ శాంతమహాసముద్రానికి ఒక వైపున అమెరికా ఉన్నది. రెండవ వైపున ఆసియా ఖండంలోని జపాను ఉన్నది. కాబట్టి యీ రెండింటికీ శాంత మహాసముద్రంలో సంగ్రామం ప్రారంభమైంది. అమెరికావంటి బ్రహ్మాండమైన రాజ్యంతో యుద్ధం చేయుటకు జపానువంటి చిన్న రాజ్యం సమకట్టినది, జపానువాళ్లు సంకల్పించినది చాలా సాహసకార్యం. ఆమాటనిజమే.

### జపాను నౌకా విమానబలం

కాని, జపానుదేశం ఇంత గర్వంతో అంత పెద్ద రాజ్యముమీద ఎట్లా కత్తికట్టినది? తనకు గల ఆయుధబలం, అమెరికాతో యుద్ధం చేయుటకు తగినంత ఉన్నదా లేదా అనేవిషయం ముందుగా జపాను లెక్కచూచుకొన్నదా? అమెరికాతో సమాన ఉజ్జీగా సమరం సాగించుటకై జపానుకుగల ఆయుధబలం ఏమిటి? ఏవిధమైన బలము సమృద్ధిగా ఉన్నదనే అహంకారంతో జపానువాళ్లు, అమెరికాతో యుద్ధం ప్రారంభించారు? ఏ పరిస్థితులు తమకు అనుకూలించగలవనే ధైర్యంతో జపానువాళ్లు అమెరికాతో సమరం సాగించారు? ఈ విషయాలు బాగా విమర్శించి చూడాలి. జపాను దేశానికి చాలా యుద్ధనావలు ఉన్నాయి. అమెరికా రాజ్యముకంటె జపాను వాళ్లే ఒకరకమైన యుద్ధనావలను ఇటీవల ఎక్కు

వగా సిద్ధపరచుకొని ఉన్నారు. విమానములను మోసికొనిపోగల యుద్ధనావలను, అనగా విమాన వాహక నావలను జపానువాళ్లే ఎక్కువగా సిద్ధ పరచుకొని ఉన్నారని తెలిసింది. పెద్ద రకపు యుద్ధనావలు అనగా 25 వేల టన్నుల యుద్ధ నావలున్నూ 30 వేల టన్నుల యుద్ధనావలున్నూ జపానుకు ఉన్నాయి. కాని, ఆపెద్ద యుద్ధనావ లను జపానుదేశపు కోస్తారేవులలోనే ఉంచి జపాను దేశాన్ని (స్వదేశాన్ని) రక్షించుటకు విధిగా ఉంచ వలసి ఉన్నది. వీలైనంతవరకు విమానవాహక నావలనే జపానువాళ్లు సాగించే నౌకా యుద్ధముల లోనికి పంపిస్తున్నారు. పెద్దరకపు యుద్ధనావ లను పంపిస్తే అవి నష్టమైతే చాలా ప్రమాదకర మనే భయంచేత పంపించడంలేదు. ఒక్క పెద్ద రకం యుద్ధనావ నష్టమైనట్లయితే, తిరిగి ఇంకొ

లేదు. ఆసియా ఖండంలోని రాజ్యాలను మాత్రమే జపాను మింగదలంచుకున్నది. ఆసియాఖండ రాజ్యాలను జపాను మింగివేయకుండా జపానును ఆటంకపరచవలెననే పట్టుదల అమెరికాకు ఉన్న యెడల, అమెరికావాళ్లే అమెరికానుండి తమ నావలతో బయలుదేరి రమారమి నాలుగువేల మైళ్లదూరం శాంతమహాసముద్రానికి అడ్డంగా ప్రయాణంచేసి రావాలి. అమెరికాకు అనేకవేల మైళ్ల దూరంలో ఉన్న ఏ ఆస్ట్రేలియాకో వచ్చి అక్కడ జపానువాళ్లతో అమెరికావాళ్లు యుద్ధం చేయవలసిన అవస్థ ఏర్పడుతుంది. కాని, ఈ ప్రాంతంలో యుద్ధం జరిగితే. జపానుకు చాలా అందుబాటులో ఉంటుంది. అమెరికాకు చాలా దూరాభారంగా ఉంటుంది. ఇక్కడ యుద్ధం చేస్తే జపానుకు ఇది సమీప ప్రాంతం,

## విష బాణాలు.

వదంతులున్నాయి జాగ్రత్త!
అవి
మీ మనస్సును మభ్యపరచి
మీ బుద్ధి చెడగొట్టి
మీచే తెలివితక్కువ పనులు చేయించుటకు
శత్రువు పంపే విష బాణాలు.

* వదంతులు నమ్మకండి. *

జపానువారి ఎదుర్కొనుటకై దేశీయ యుద్ధరంగం తయారుచేయుడు.



కటి అటువంటిది నిర్మించవలెనంటే తాతలు దిగి రావాలి. ఏడెనిమిది సంవత్సరాలు ఏకదీక్షగా పనిచేస్తేనేగాని పెద్ధరకం యుద్ధనావను నిర్మించు టకు సాధ్యంకాదు. అందువల్ల పెద్దరకం యుద్ధ నావలను సముద్ర యుద్ధరంగంలోనికి పంపించ వలసిన అగత్యం లేకుండా, జపానువాళ్లు తమకు గల విమానవాహకనావలనే పంపించి అమెరికను నౌకాదళముతో యుద్ధం చేయవచ్చునని లెక్క చూచుకొన్నారు. తమకుగల యుద్ధనౌకాదళం అమెరికాతో సమానహోదాగా యుద్ధంచేయుటకు చాలా సమర్థమైనదనే గర్వం జపానుకు కలిగింది.

అందువల్లనే, ఆ గర్వాతిరేకమువల్లనే, అమెరి కాతో యుద్ధం చేస్తానని జపాను సవాలుచేసింది. జపానుకు ఇంకో గర్వంకూడా ఉంది. అమెరికా మీద జపానుదేశం యుద్ధం ప్రకటించినప్పటికీ, అమెరికా ఖండంమీదకు జపానువాళ్లు దండెత్తి పోవలసిన పనిలేదు. అమెరికా రాజ్యాన్ని జయించి ఆక్రమించవలెననే సంకల్పం జపానుకు

అమెరికాకు చాలా వ్యయ ప్రయాసతోకూడిన పని. ఆస్ట్రేలియాకు సమీపంగా ఉన్న డచ్చి యీస్టు యిండీసు దీవులను జపానువాళ్లు ముం దుగా ఆక్రమించుకొని అక్కడ మకాము ఏర్ప రచుకొన్నారు. సింగపూరు రేవు వాళ్ల చేతుల లోనే ఉంచుకొన్నారు. ఆస్ట్రేలియాకు కొంచెం దగ్గరగా తూర్పువైపున ఉన్న సాలమను దీవు లనుకూడా ఆక్రమించుకొన్నట్లయితే ఆస్ట్రేలి యాకు నలువైపులను జపానువాళ్లు స్థావర మేర్పరచుకొనవచ్చుననే ఆశతో సాలమను దీవు లను ఆక్రమించుకొనవలెననే ప్రబల ప్రయత్నం సాగించారు. ఆస్ట్రేలియాకు అమెరికానుంచి సహాయం రాకుండా నిరోధించవలెనంటే, ఆస్ట్రే లియాకు దగ్గరగా త్రోవలో ఉన్న సాలమను దీవులను ఆక్రమించుకొనక తప్పదు. అందు వల్ల సాలమను దీవులవద్ద జపానుకు అమెరికాకు నౌకా యుద్ధం జరుగవలసియున్నది. సాల మను దీవులవద్ద జపానువాళ్లకు స్థానబలిమి

ఉన్నది అమెరికా యుద్ధ నావలకు అది సమీప ప్రాంతం కాకపోవుటవల్ల స్థానబలిమిలేదు. ఇటువంటి పరిస్థితిలో దూరప్రాంతంనుండి బయలుదేరివచ్చేడి అమెరికను నౌకాదళమును, తమకు అందుబాటుగా ఉన్న సముద్రప్రాంతంలో సులభంగా ఓడించగలమనే అహంకారం జపానుకు ఇటీవల మరింత ఎక్కువగాకలిగింది

జపాను గర్వభంగం

విమాన వాహకనావలు ఎక్కువగా తనకు ఉన్నవనే గర్వంతో జపాను బయలుదేరింది. మిడ్వే దీవులవద్ద అమెరికా నౌకాదళంతో మొదట ఒక నౌకా యుద్ధం చేసింది. ఆ విమాన వాహకనావలమీద జపాను విమానాలు వచ్చాయి. ఆ విమానాలు అమెరికను నావలమీద బాంబులను టార్పెడోలను ప్రయోగించి అట్టహాసంగా యుద్ధంచేసి అమెరికను యుద్ధ నావలను కొన్నింటిని ముంచినవి, కాని, జపానువాళ్ల విమాన వాహకనావలు కొన్ని మిడ్వే దీవుల యుద్ధంలోను, అటుతర్వాత కోరలు సముద్ర యుద్ధంలోను, సముద్రస్నానంచేసి మునిగిపోయినాయి. అట్టుతర్వాత సాలమను దీవులవద్ద మొదటి పర్యాయంగా అమెరికను నావలతో యుద్ధం చేసినప్పుడుకూడా జపానువారి విమాన వాహకనావలు బాగా దెబ్బలు తిన్నాయి. సముద్రం ఎంతలోతు ఉన్నదో దిగి బాగా తెలిసికొన్నాయి. రెండవసారి తిరిగీ సాలమను దీవులవద్ద గడచిన వారంలో అమెరికను యుద్ధ నావలతో జపాను నావలు నౌకా యుద్ధం చేయవలసివచ్చింది. ఈ నవంబరు 13, 14, 15 తేదీలలో నౌకా యుద్ధం జరిగింది. ఈ యుద్ధంలో జపానువారి విమాన వాహకనావలు లేవు. "వారికి ఉన్నటువంటి విమాన వాహకనావలన్నీ యీవరకే సముద్ర గర్భంలో అంతర్ధానమై ఉండాలి. లేదా, ఏమైనా ఒకటి రెండు మిగిలి ఉంటే వాటినికూడా పోగొట్టుకొనడం బుద్ధి తక్కువ పనియని గ్రహించి జపానువారు తీసికొని వచ్చియుండలేదు" అని అమెరికను నౌకా దళాధిపతియైన అడ్మిరలు నిమిజుగారు మొన్న నీ రహస్యం విప్పిచెప్పారు. కనుక, జపానువాళ్లకు విమాన వాహకనావలు ఎక్కువగా ఉన్నవనే గర్వం యీ రెండవ సాలమను యుద్ధంలో సాంతంగా శాంతించింది.

జపాను నష్టం.

ఈ రెండవ సాలమను నౌకా యుద్ధంలో 23 జపాను నావలు-బాగా దెబ్బలుతిని, రంధ్రాలు పడి, కడుపునిండా నీళ్లుతాగి, అమెరికావారి పుణ్యమువల్ల సాలమను సాగర సంగరంలో సాగర సంగమం చేసినాయి. మునిగిపోయిన యీ 23 జపాను నావలలో 11 యుద్ధ నావలు కలవు. ఈ 11 యుద్ధ నావలలో ఒక పెద్దరకం యుద్ధ నావయున్నూ, 3 పెద్ద క్రూయిజరులున్నూ కలవు. 7 చిన్న యుద్ధ నావలు బాగా ధ్వంసమైనాయి. జపాను సైనికులను రవాణా చేయునట్టి 12 రవాణా నావలు నాశనమైనాయి. గత శనివారం నాడు 8 రవాణా నావలు ముంచబడినప్పుడు ఆ 8 రవాణా నావలలోను ఉన్నటువంటి 24 వేల జపాను సైనికులు ఆ నావలతో సహా సముద్ర గర్భంలోకి శీఘ్రంగా ప్రవేశించి రూపులేకుండా పోయినారు. జపానుకు కలిగిన రాజ్యదాహం ఇంతా అంతాకాదు. రాజ్యదాహంతో తపించి పోతోంది. ఈ రాజ్య దాహతాపం ఉపశమించుటకోసం "పానీయం సమర్పయామి" అన్నట్లుగా అమెరికా నావలువచ్చి అప్పుడప్పుడు సమృద్ధిగా జపాను నావలచేత నీళ్లు తాగిస్తునే వున్నాయి. జపాను యుద్ధ నావలకు ఉప్పునీళ్లు తాగితేనేగాని దాహంతీరదు. ఇది సాధారణ పానీయంకాదు. కేవలం జపానువాళ్లకొరకై ప్రత్యేకంగా అమెరికానుంచి వచ్చిన అమరులు నిర్ణయించిన జపానీయం ఇది. జపానీయం అంటే సాధారణ జన జల పానీయంకాదు. ఇదిసముద్ర జలపానీయం.

అప్పుడప్పుడు ఏదో ఒక మాసంలో అమెరికావారు జపాను నావలకు "మధ్యేమధ్యే జపానీయం సమర్పయామి" అని చెప్పి జపాను యుద్ధ నావలచేత సముద్రజలం తాగిస్తున్నారు. జపానీయం సమర్పిస్తూవున్నారు. (1) మిడ్వే దీవులవద్దను,(2) కోరలు సముద్రములోను, (3) సాలమను దీవులవద్దను ఇదివరకు మూడు సార్లు జపాను నావలను ముంచివేసారు. ఆ జపాను నావలకు యీ సాగర సంగరంలో సాగర సంగమం జరుగుతూనే ఉన్నది. కిందటి వారం తిరిగి రెండోసారి సాలమను దీవులవద్దనే "జపానీయం సమర్పయామి" అన్నారు. మూడోసారి మళ్లీ సాలమను దీవులవద్దకే జపాను నావలు రావచ్చునని అమెరికా నౌకా శాఖాధికారి కర్నలు నాక్సుగారు అన్నారు. మూడోసారి వస్తే మళ్లీ వారి రాజ్యదాహ "తాపోప శమనార్థం" జపానీయం సమర్పించి జపాను నౌకా దళానికి అంత్యక్రియలు పూర్తిచేసి శాంతి మహాసముద్రంలో ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః అంటారు. లోకానికికూడా శాంతి ఏర్పడుతుంది.

# విదేశాలందు 3,50,000 భారతీయ సేన.

●

తనంత తాను చేరిన ప్రపంచంలోకెల్ల పెద్ద సేన.

●

1938 లో 1,77,000 ఉండిన భారతీయ సేన నేడు 15,00,000 వరకు పెరిగింది. ప్రపంచంలోకెల్ల పెద్ద ఐచ్ఛిక సేన యిదియే, అని మేజరు రాజకుమారు రాజేంద్ర సింగుగారు న్యూయార్కు నగరంలో తెలిపిరి. భారతీయ సేనకు పరికరాలు యిచ్చినచో యితర సేనలు దేనితోనైన, ముఖ్యంగా జపానువారితో సరిసమానంగా తులతూగ గలదని అతడనెను.

మేజరు రాజేంద్ర సింగుగారు, రెండవ బెంగాలు లాంసరుల దళమునందు సభ్యులు; అదివరకు ఉత్తరాఫ్రికాలో యుద్ధం చేసినందుకు బిరుదులొసంగబడిరి.

అదివరకు ఇండియాలో సైన్యంలో చేరుటకు కొన్ని జాతులవారికి ఆక్షేపణనుండెను. ఇపుడు ఆక్షేపణ తొలగిపోయింది; నెలకు 70,000 మంది కొత్తవారు సైన్యంలో చేరుచున్నారు. మొత్తం 3,50,000 భారతీయులు తమ దేశరక్షణకై విదేశాలందు పోరాడుచున్నారని అతను చెప్పెను.

తన సరిహద్దులు అటు ఏడెను, సూయజుల వరకు యిటు సుడాను మలయాలవరకు విస్తరించునని 1939 లోనే ఇండియా గుర్తించి త్వరగ అక్కడికి సేనలను పంపెనని మేజరు రాజేంద్ర సింగుగారు చెప్పేరు. రోమెలు సేనలను యిపుడు తరుముచున్న 4 వ భారతీయ డివిజను గూర్చి వారు తెలిపిరి.

భారతీయుల యుద్ధ పరికారల ఉత్పత్తి, ఫిరంగులు, జోళ్లు, కంబళ్లు తయారు చేయుటగూడ బాగా పెరిగింది. ఇండియాలో విమాన భాగాలు జతకూర్చి విమానాలను తయారుచేయు యంత్రాలు మంచివిగలవు. అచట యిపుడు అమెరికా విమానాలు జతగూర్చబడుచున్నవని వారు తెలిపిరి.

# బ్రిటను యుద్ధ రంగాలన్నింటి కేంద్రం.

●

రష్యాలో 2,000 మైళ్ల పొడవు యుద్ధరంగము, దూర ప్రాచ్యానికి ప్రపంచమంతా చుట్టిపోవు నౌకా మార్గాలు, ఈజిప్టులో యుద్ధరంగాలన్నింటియందుగూడ బ్రిటిషు సైనికులును బ్రిటనులో తయారగుచున్న యుద్ధ పరికరాలును ఉపయోగించబడుచున్నందున యుద్ధరంగాలన్నింటికి ఇంగ్లాండే కేంద్రమని చెప్పవచ్చును.

సంయుక్త రాజ్యాల సేనాధిపతులకు లెక్కలేనన్ని బాంబరు విమానాలు, యుద్ధనౌకలు కావాలి. అన్నింటినీ ఇంగ్లాండే తయారు చేయలేకున్నా ఇంగ్లాండులోని పరిశ్రమల కృషి గర్వింపదగినదిగానుంది. నౌకా నిర్మాణమునందేగాక యితర యుద్ధ పరికరాలన్నింటి ఉత్పత్తియందుగూడ ఇంగ్లాండులో ఉత్పత్తి యితర దేశాలన్నింటిలోకన్న కార్మిక జనసంఖ్యతో పోల్చిచూచిన అధికంగా గలదు. బ్రిటిషు విమాన నిర్మాణాల ఫ్యాక్టరీలు ఆగస్టులో 5 టన్నుల విమానాలు తయారు చేస్తే సెప్టంబరులో 6 టన్నులు కట్టినవి. బ్రిటిషు యుద్ధ పరిశ్రమలలో తయారయ్యే సరకులో నూటికి 80 వంతు విదేశాలకు పోతున్నది.

"హిట్లరు యుద్ధంలో గెలవాలంటే కోట వంటి బ్రిటిషు దీవి ఆక్రమించాల్సి వుండును. ఆ దీవిలోనే ప్రపంచమంతటి మారు మూలలలో ముగ్గురు శత్రువులను ఎదిరించుటకు కావలసిన ఆయుధ పరికరాల కేంద్ర నిర్మాణశాలలున్నాయి. 2,000 మైళ్ల దూరం ప్రమాదకరమగు సముద్రాలు దాటి నావికులు, వైమానికులు, సరకు రష్యాకు గొంపోవుచున్నారు. ప్రపంచ చుట్టు కొలతకు 3½ రెట్లధికంగానున్న నౌకా మార్గాలను కాపలా కాస్తున్నారు. రెండు మూడు వేల వర్తక నౌకలు ఎపుడూ ప్రయాణం చేస్తూవుంటే వాటిని కాపాడుచున్నారు. విమాన నౌకాదళ శక్తిని వృద్ధిచేసుకోడంలోనే విజయం యిమిడియున్నది.". అని బ్రిటిషు మంత్రి హెర్బర్టు మారిజనుగారు తెలిపిరి.

---

## సైనికులకు ఎక్కువ జీతాలు.

సైన్యంలో చేరిన ప్రతి సిపాయికి రెండేండ్ల క్రిందటికన్న యిపుడు చాల ఎక్కువ డబ్బుగిట్టుచున్నది అనేక రకాల అలవెన్సులు యిస్తున్నందున కొందరు సిపాయిలకు

వారి కుటుంబాలకు ఎంతజీతం తమకు వస్తున్నదో తెలియదు. వివరాలు యీదిగువ తెలుపబడినవి —

బేసికు జీతం

భారతీయ సిపాయికి, నానకాంబటెంటు సభ్యునికి బేసికు జీతం 1942 వ సం॥ సెప్టంబరు 1 వ తేదినుండి నెలకు రూ 2 లు ఎక్కువ చేయబడింది. అనగా సిపాయికి రూ 18 లు, యితరులకు రూ 17 లు.

సమర్థత జీతం

సేనానాయకుడు (సి ఒ) యిష్టం చొప్పున యిది యివ్వబడును ఒక ఏడాది సర్వీసు అయినాక రూ 3-8-0 లు నెలకు యివ్వవచ్చునని యిదివరకుండగా, యిప్పుడు 6 నెలల సర్వీసు అయినాక రూ 1 యివ్వవచ్చునని, ఏడాదయినాక రూ 3-8-0 లు యివ్వవచ్చునని నిర్ణయించేరు.

మంచి సేవకు జీతం

ఇదన్నీ సి.ఒ యిష్టముంటే యివ్వవచ్చును నానుకమిషండు ఆఫీసరులకు మంచి శ్రద్ధ సమర్థత చూపినవారికి 2, 4, 6 ఏండ్ల సర్వీసుల వారికి రూ 2, 4, 6 లు నెలకు ఎక్కువ యివ్వవచ్చునని యుండెను. ఇపుడు 1, 2, 3 ఏండ్ల సర్వీసుకాగానే యీ వేతనాభివృద్ధి ప్రారంభించవచ్చు.

విదేశాల అలవెన్సు

విదేశాలకు పంపబడిన భారతీయ సైనికులకు నెలకు రూ 2 లు. 1940 వ సం॥ డిశంబరులో ఎక్కువ చేసేరు. ఇపుడున్న రేట్లు —

| | నెలకు రూ. | | నెలకు రూ |
|---|---|---|---|
| సుబేదారు మేజరు | 22 | నాయక్ | 11 |
| సుబేదారు | 32 | లాంసు నాయక్ | 7 |
| జమేదారు | 14 | సిపాయి | 7 |
| హవల్దారు | 11 | | |

బత్తా.

భారతీయ సైనికులు యుద్ధరంగ ప్రాంతంలో పనిచేయుచున్నపుడు యిది యివ్వబడును ఇది కూడ 1940 వ సం॥ డిశంబరులో రూ 2 లు పెంచబడింది ఇప్పటి రేట్లు :—

| | నెలకు రూ | | నెలకు రూ. |
|---|---|---|---|
| సుబేదారు మేజరు | 18 | నాయక్ | 8 |
| సుబేదారు | 18 | లాంసు నాయక్ | 5 |
| జమేదారు | 11 | సిపాయి | 5 |
| హవిల్దారు | 8 | | |

భోజనం అలవెన్సు.

వస్తు రూపంగా యిచ్చే భత్యాలకు తోడుగ యిది యివ్వబడును. అదివరకు అ 10 లు ఉన్న యీ భత్యం 1941 వ సం॥ డిశంబరులో రూ 2 లు వరకు పెరిగింది 1942 వ సం॥ సెప్టంబరులో యింకో రూపాయ పెంచారు. ఇపుడు నెలకు రూ 3 లు యిస్తారు.

చివరకిచ్చే జీతం.

సిపాయి సర్వీసు చేసిన కాలమంతకు నెలకింత చొప్పున లెక్క చూసి వెడలిపోవునపుడో వైస్రాయి కమిషను ఉద్యోగిగ ప్రమోషనయినపుడో మొత్తంగా యిస్తారు. ఇది బలవంతపు ఊర్జితం సిపాయిపని మానేసినాక యిబ్బంది లేకుండా జీవితం గడుపుకోడానికి పెట్టుబడిగా ఉపయోగించునని ఉద్దేశించబడింది ఇది 1942 వ సం॥ ఏప్రిలులో రూ 1 నుండి రూ 3 లు వరకు పెంచబడింది. నానకాంబటెంట్సుకి గూడ నెలకోరూపాయి యిచ్చుటకు అపుడు నిశ్చయించబడెను.

సహాయ నిధి.

యుద్ధానంతరం భారతీయ సిపాయిలకు వారి కుటుంబాలకు లాభించు స్కీముల కొరకై ప్రతి ఒక సిపాయికి రూ 2 లు చొప్పున జతచేసి నిధి ఏర్పరుచబడెను

# కాశీ క్షేత్రం.



జపానువారు సింగపూరును స్వాధీనం చేసుకొన్న వెంటనే ఆ నగరమునకు జపానీ పేరు పెట్టినారు. జపానువారు మన పట్టణములను, పవిత్ర స్థలములను వశపరచుకొనడం తటస్థించినట్లయిన వీటికిగూడ ఇదే విధంగా జరుగుతుంది. మత సాంప్రదాయమువల్లను చారిత్రాత్మకంగాను పేరుగాంచిన పట్టణములన్నియు పాడుచేయుటే గాక జపానీ పేర్లను పెట్టి వాటినే వాడాలని శాసిస్తారు. భారతీయుల అభిప్రాయములను లెక్కచేయరు.

ఈ దేశమునకు చెందిన మన మందరము ఎట్టి పోరాటము లేకుండ అట్టి అనాదరణకు ఒప్పుకుంటామా? కూడదు. సమిష్టి ప్రతిఘటనచేసి ఈ రాక్షసులను ఎదుర్కొందము.

జపానువారి నెదుర్కొనుటకై
దేశీయ యుద్ధ రంగమును
తయారుచేయుడు.



PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS AND PUBLISHED BY THE DIRECTOR OF WAR PUBLICITY, "VICTORY HOUSE", MOUNT ROAD, MADRAS.